శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః

# గీతార్థ సారము

గ్రంథకర్త

శ్రీ వేదుమూరి గంగాధరం

"కావ్యపాక ప్రవీణ"

బ్రహ్మశ్రీ ధవళసుందర నారాయణకవిగారిచే సవరింపబడెను

దేశసేవ పత్రికనుండి పునర్ముద్రితము

1 నుండి 6 అధ్యాయలు

ఒకటవ భాగము

రాజమండ్రి శ్రీ వెంకటేశ్వర ప్రింటింగ్ వర్క్సునందు
ముద్రింపబడెను.

 1955 వెల 0-8-0

## ☆ విషయసూచిక ☆



## గమనిక



7 నుండి 12 అధ్యాయము 2వ భాగము

13 నుండి 18 అధ్యాయము 3వ భాగము

త్వరలో వెలువడును.

# విద్వాన్ శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారొసంగిన అభిప్రాయము



శ్రీయుత నేదునూరి గంగాధరకవిగారు రచించిన "గీతార్థసారము" చూచినాను. కృష్ణపరమాత్మ చెప్పిన సంస్కృత 'భగవద్గీత' కిది సారము. తెనుఁగున నిది గేయరూపముగ పొందుపఱచఁబడినది. ఇందు ఆరు అధ్యాయములు 1 భాగముగా అచ్చుఅయినవి. మిగిలిన 2, 3 భాగములు త్వరలో అచ్చుకావలెనని కోరుచున్నాను. ఇందలి భాష--భావము--నుడికారము మున్నగునవి తెనుఁగు జాతీయతను మిక్కిలి వెలయించుచున్నవి. సంస్కృత మెఱుఁగని తెనుఁగువారి కీపుస్తకమువలన భగవద్గీత సారమంతయు సులభముగ బోధపడును. హాయిగా పాడుకొనుటకు వీలుగా నుండుటచే, తెనుగు పడుచుల ఆదరాభిమానముల కీపొత్త మెంతయు పాత్రమైయుండునని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

వేదాంతగ్రంథము లెంత జటిలములుగ నున్నను నిందలిసారము తేట తెనుఁగులో పాటలరూపమున బయలుదేరినపుడు ప్రజాసామాన్యమున కెంతయు నుపకారము గల్గును.

శ్రీ కవిగారి కృషి యెంతయుఁ బ్రశంసనీయమనియు నీ గీతార్థసారమాంధ్రుల యాదరాభిమానములకుఁ బాత్రమై శాశ్వతకీర్తి నార్జించుఁగాత మనియు కోరుచున్నాను.

ఇట్లు

బత్తుల కామాక్షమ్మ

ప్రిన్సిపాల్

ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల

రాజమండ్రి
14-10-55.

గవర్నమెంటు గరల్స్ ట్రైనింగుస్కూలు తెలుగుపండిట్

ఉ భ య భా షా ప్ర వీ ణ

# శ్రీమతి రావూరి వెంకట సుబ్బమ్మగారిచ్చిన అభిప్రాయము



శ్రీ నేదునూరి గంగాధరంగారు రాజమహేంద్రవరమునకేగాక యావదాంధ్రదేశమున కంతటికిని చిరపరిచితులనునది నిర్వివాదాంశము.

వీరు బాల్యమునుండియు చేసిన సాహిత్యసేవ అపారము, అమోఘము, అజ్ఞాతము.

వీరు పాతపాట అను పేర ప్రాచీన జానపద వాఙ్మయమును పదివేల పుటలకు మించి గ్రంథమును మిగుల శ్రమపడి సేకరించినారు.

అదియునుగాక వీరి స్వంతరచనలు చిన్నవి, పెద్దవి మొత్తముమీద యేబది గ్రంథములకు మించియున్నవి.

ఇప్పుడు వీరు గీతార్థసారమను పేరుతో భగవద్గీతను పదముగా వ్రాసి యందారధ్యాయములను ముద్రింపించియున్నారు.

శ్రీ భగవద్గీత సంస్కృతభాషలో నుండుటయేగాక వేదాంతవిషయమగుటచే నతి దురవగాహము.

అట్టిగీతను వీరాభాష నర్థముచేసికొని, యందలి విషయముల నవగాహము చేసికొని, సరళశైలి చక్కనిభాషలో పదముగా జనసామాన్యమున కందుబాటులో నుండునట్లు వ్రాయుట యెంతయు ప్రశంసనీయము. వీరికిం దగిన ప్రోత్సాహమొసగి తోడ్పడుట మన యాంధ్రుల కర్తవ్యము.

పరమేశ్వరుడు వీరి కాయురారోగ్యముల నొసగి, యిట్టి రచనలను గావించుచు నితోధిక భాషాసేవ సలుపుశక్తినిం ప్రసాదించుగాక.

రాజమండ్రి
15-10-55.

ఇట్లు
రావూరి వెంకట సుబ్బమ్మ

# శ్రీమతి అద్దేపల్లి వివేకానందదేవి బి. ఎ.గారి
# అభిప్రాయము

జాతి పురోభివృద్ధి మాతపైనుండును. అట్టి అజ్ఞాన అంధకారమున మున్గియుండ జాతికి, మాతృదేవులు జ్ఞానోదయము స్వయంప్రకాశశోభ ఎచ్చటనుండును?

మన సంప్రదాయ సంస్కృతులకభావముకల్గునని భీతి జెందువారికాశాజ్యోతిగా 'గీతార్థసారము' వంటి గీతామాల మహిళామణుల జ్యోత్యారాధనలలో మరియొక వెలుగుగా వెల్వడినది. దీనిని రచించి, సోదరీమణుల మన్ననలందుటయే గాక జీవితమును ధన్యముగావించుకొన్నారు రచయిత గంగాధరంగారు.

ఆంధ్రలోకం, అందున అబలాలోకం మారీబుణపడింది. వీరికి; జానపదగేయ సంపాదనయందు. జానపదాలన్నీ తిరిగి సేకరించి జనామోదము గడించారు గంగాధరంగారు. వేమన పద్యాలను సేకరించికూడా వీరు ధన్యులైయ్యారు. ప్రజాదరణే వెన్నెముకగానున్నది నేటి వాఙ్మయమునకు. అట్టితరి సహృదయులైన ప్రజలు వీరి రచనలకు ప్రోత్సాహమిచ్చుట కర్తవ్యము.

తెనుగు సాంప్రదాయమును ముంజేతి కంకణముగా చూపు 'స్త్రీలపాటల' వంటివి నేడు నశించుపోవుచున్నవి. వీటిప్రచారమునకు సాయిపడిన గంగాధరంగారికింకను తమ సోదరీమణులకు చేయూతనిచ్చుశక్తిని భగవంతుడు ప్రసాదించుగాకయని కోరుచున్నాను.

అద్దేపల్లి వివేకానందదేవి బి. ఎ.
మ్యునిసిపల్ కౌన్సిలర్

# శ్రీమతి తులసి వెంకటరత్నమ్మగారొసగిన

# అభిప్రాయము

మూస్లిములకు 'ఖురాను', క్రైస్తవులకు 'బైబిలు' యెట్లు పవిత్రగ్రంథములో, అట్లే హిందువులకు 'భగవద్గీత' పవిత్రగ్రంథరాజము.

శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు కురుక్షేత్రమునందు కురుపాండవుల యుద్ధారంభమున యీ గీత నుపదేశింపగా, వ్యాసమహర్షి దీనిని సంస్కృతమున 18 అధ్యాయములుగా రచియించెను.

ఈ పవిత్ర గ్రంథమునకు పలువురు మతకర్తలును, అనేకులు మహామహులును వ్యాఖ్యానములు రచించినారు. ఆవ్యాఖ్యానములు పండితులకే అందుబాటులో నున్నవి

శ్రీయుత వేమనూరి గంగాధరంగారు 'భగవద్గీత'లోని ముఖ్యాంశములను జారనీయకుండా, జానుతెలుగున పండిత, పామర, బాలబాలికలకుసహితము ఉపయోగపడునట్లు తేటతెల్లముగా, స్త్రీలపాటగా "గీతార్థసారము" అను దీనిని రచియించి కృతకృత్యులైనారు.

*ఈక్రింది ఆంధ్రీకరణములను చిత్తగించండి.*

"స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః"—1_41

జాతిహీనత నొందరా! మన స్త్రీలు। వర్ణసంకరము కాదా—1_41

"పతన్తి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః"—1_45

పిండోదకములేమి, అధోగతి। పితృదేవతలందరే—1_15

"యద్వా జయేమ యది వా నో జయేయుః"—2_6

పూజ్యులుండా యీరణమున మనగెల్పు పూచీగ చెప్పగలవా—2_5

ఈవిధముగా పసిడితునకల్లాంటిపదజాలంతో యీ 'గీతార్థసారం' రచియించిన శ్రీ గంగాధరంగారికి ప్రజలు, సంస్థలు, ప్రభుత్వమువారును ఉచితరీతిని సహాయంచేసి, యితోధిక భాషాసేవ చేయించగలందులకు కోరుచున్న దానను.

రాజమండ్రి
20_10_55.

ఇట్లు
తులసి వెంకట రత్నమ్మ

# మనవిమాటలు



భాషాభిమానులకు, భక్తులకు ప్రాంజలి.

భారత భాగ్యజ్యోతి 'మహాత్మా గాంధీ' గారు పరమపదించినప్పుడు ప్రపంచమే దుఃఖాంబుధిలో మునిగినపుడు నేనును దుఃఖితుడనై ఆ మహాత్ముని పోకడను తలపోయుచు "బాపూజీ భాష్పాంజలి" అనే పద్యములు, పాటను వ్రాయుచు, 'నీకుప్రియమైన గీతను, దేవతలకు వినిపించ పట్టుకొనివెళ్ళితివా?' అని స్మరించుచు ఆవేశంతో యీ "గీతార్థసారము"ను రచియించితిని. ఇది గోదావరి వరదకు తడిసిపోగా, 'దేశసేవ' పత్రికాధిపతులు శ్రీ బోడపాటి యీశ్వరప్పగారుయెంతో చింతించి దీనిని క్రమముగా తమపత్రికలో ప్రచురించుటకు హామీనిచ్చి, నన్ను ఓదార్చి, యిప్పటికినీ క్రమముతప్పక 'దేశసేవ'లో ప్రచురించుచున్నారు. ఆ పత్రికను చదివిన వారిలో ముఖ్యులు శ్రీమతి తులసి వెంకట రత్నమ్మగారు 'గీతార్థసారము'ను అచ్చువేయించి వ్యాప్తిచేయించవలెనని యీ కమిటీవారిని ప్రోత్సహించి' తమకుమారుడు శ్రీ తులసి గంగాధర రామారావును నిధిసేకరణకర్తగానియమించి, పెక్కండ్రు దాతలసహాయమున యీగ్రంథ మచ్చొత్తించి సన్మానములు చేయించుటకు 'శ్రీరామ బాలభక్త పుస్తక భాండాగారము' వారిని హెచ్చరించినారు, కావున నాయందిట్టి అభిమానమును చూపిన అందరకూ యిందుమూలముగా వందనములర్పించుచున్నాడను.

రాజమండ్రి
21-10-55.

ఇట్లు విధేయుడు
నేదునూరి గంగాధరం

# విరాళములిచ్చిన దాతలు



| | |
|---|---|
| శ్రీమతి అడ్డేపల్లి వివేకానందదేవిగారు | 15-0-0 |
| శ్రీ కొజ్జరపు బాపిరాజుగారు (కాకినాడ) శాలువతో సహా | 15-0-0 |
| శ్రీ కారుమూరి సర్వేశలింగంగారు | 10-0-0 |
| శ్రీ తడవర్తి వెంకటస్వామి | 10-0-0 |
| శ్రీమతి కోడూరి లీలావతీదేవి | 10-0-0 |
| శ్రీ పువ్వాడ సుబ్బారావు అండ్ బ్రదర్సువారు | 10-0-0 |
| శ్రీ ఇన్నమూరి చెంచయ్యగారు (వైస్ ఛైర్మన్) | 10-0-0 |
| శ్రీ రవణం శ్రీరాములుగారు | 10-0-0 |
| శ్రీ పొన్నాడ భాస్కరం బ్రదర్సువారు | 10-0-0 |
| శ్రీ చలుమూరి పోతరాజుగారు (టౌన్ కాంగ్రెసు ప్రసిడెంటు) | 10-0-0 |
| శ్రీ యం. వి. శాస్త్రిగారు | 10-0-0 |
| శ్రీ రాయపూడి సూర్యనారాయణగారు | 10-0-0 |
| శ్రీ బత్తిన సుబ్బారావుగారు (ఆంధ్రశాసనసభ్యులు) | 10-0-0 |
| శ్రీ దేవనశెట్టి రామ్మూర్తిగారు నవభారతి గురుకులం మేనేజరుగారగు | 10-0-0 |
| శ్రీ బుల్లెయ్యగారు | 10-0-0 |
| శ్రీ వాజపేయయాజుల వెంకటేశ్వర్లుగారు | 10-0-0 |
| శ్రీ పట్నాల అప్పలస్వామిగారు | 10-0-0 |
| శ్రీ కుమిలి అప్పలుగారు | 10-0-0 |

| | |
|---|---|
| దానవాయిపేట కమిటీవారు:— | 58–0–0 |
| శ్రీ బచ్చు సత్యానందంగారు | |
| శ్రీ యేరుకొండ వెంకన్నగారు | |
| శ్రీ కొత్తసూర్యనారాయణగారు | |
| శ్రీ కొండూరి గంగరాజుగారు | |
| శ్రీ అందే రమణరావుగారు | |
| శ్రీ కాండ్రకోట వెంకటరమణమూర్తిగారు | |
| శ్రీ పరాంకుశం మాలాస్వామిగారు | |
| శ్రీ పెనుగొండ వీరన్నగారు | 5–0–0 |
| శ్రీ మాడా వీర్రాజు అండ్ బ్రదర్సువారు | 5–0–0 |
| శ్రీ కోనాల నూకరాజుగారు | 4–0–0 |
| శ్రీ రౌతు చంద్రయ్యగారు | 5–0–0 |
| శ్రీ రూళ్ల వెంకటేశ్వరరావు అండ్ బ్రదర్సు (పాండురంగా విలాస్) | 5–0–0 |
| శ్రీ చల్లా రామగణపతిప్రసాదశాస్త్రిగారు | 5–0–0 |
| శ్రీ పామర్తి కృష్ణమూర్తిగారు | 5–0–0 |
| శ్రీ బలభద్ర వెంకట్రాజుగారు | 5–0–0 |
| శ్రీ పువ్వాడ నరసింహమూర్తిగారు | 5–0–0 |
| శ్రీ జి. వరదరావుగారు | 5–0–0 |
| శ్రీ యం. వెంకటకృష్ణయ్యగారు | 5–0–0 |
| శ్రీ ఎం. రామయ్యనాయుడుగారు | 5–0–0 |
| శ్రీ నాగవరపు శేషగిరిరావుగారు | 5–0–0 |
| శ్రీ పి. వీరభద్రరావుగారు (ఛైర్మన్) | 5–0–0 |

| | |
|---|---|
| శ్రీ కె. వి. రత్నంగారు | 5—0—0 |
| శ్రీ బెజవాడ వీర్రాజుగారు | 3—0—0 |
| శ్రీ కొప్పుశెట్టి సూరమ్మగారు | |
| శ్రీ జిల్లా సుబ్బారావుగారు | |
| శ్రీ అవసరాల కామరాజుకవిగారు | |
| శ్రీ కుడిపూడి ముత్యంగారు | |
| శ్రీ కొత్తమాసు రంగనాయకులుగుప్తగారు | |
| శ్రీ కక్కిరాల ఆత్మారామ్‌గారు | |
| శ్రీమతి రావూరి వెంకటసుబ్బమ్మగారు | |



"గీతార్థసార" రచనారంభమున ::

గ్రంథకర్త :

# శ్రీ నేమూరి గంగాధరం

1.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః

# గీతార్థసారము

## (పాట)



'కస్తూరి రంగ రంగా......' అను వరుస

## —:ప్రథమాధ్యాయము:—

పల్లవి:- గీతార్థసార మిదిగో!
జనులార నీతితో సేవింపరే
భీతిని బొంద కికను, భగవాను
ప్రేమరాజ్యము నొందరే!

1. కురూపాండవా సేనలు
దురముకై కురుక్షేత్రమందు గూడ
శౌరి తన రథము దోలిల
ఫల్గుణుడు జనుదెంచె ననిసేయగా. ॥గీ॥

2. ఇరుసేనల మధ్యను
ఆరథం బేతేర నర్జునుండు;
మురవైరివైపు జూచి
యిట్లనియె మోదంబు నొప్పారగా: ॥గీ॥

3. "కురువీరు లెవ్వ రెవ్వరో?
నాతోడ దురమునూ గావింతురో

అరయుంగ వలయు కృష్ణ,
మనరథం బాపుమా యిచ్చోటనే." ॥గీ॥

4. నరుని వాంఛితము నెఱిగి
రథ మాపి హరి యిట్టులనియె కూర్మి:
"నరలోక కంఠీరవా!
అరయుమా! కురుసేన యోధాళిన్" ॥గీ॥

5. హరి యిట్టు లనగ నపుడు
విజయుండు సైన్యంబు నరసి వేగ
తఱుగని కంపమొంది
కడుభీతి దశదిశల్ వీక్షింపుచూ ॥గీ॥

6. "సరసిజానాభ గనుమా!
స్వజనమే సంగరము జేయవచ్చె
వీరినీ జూడ మేను
వణకుచు నో రెండిపోవుచుండె. ॥గీ॥

7. అవయవంబులు సడలెను
ఒడలెల్ల నివె పులకలూ లేచెను
మేనిచర్మము మండుచు,
నిలువంగ లేని శక్తి దోచెను ॥గీ॥

8. కంపించుచుండె మనసు,
నా చేతి గాండీవ మిది జాఱెను
దుష్టశకునములు దోచె,
స్వజనమును దురమందు సంహరింప ॥గీ॥

9. గలుగు మే లేమేమిటో
యూహింప గష్టమగుచుండె కృష్ణ
కోరను జయము సుమ్మా
రాజ్యాన్ని కోరనూ నమ్మమయ్యా, ॥గీ॥

10. కాంక్షింప నీ సుఖమును,
భోగాలు కలుగంగ నాశింపను;
తక్షణము మరలు మన్న
శాంతికై తగు యత్నమును సేయుమా ॥గీ॥

11. మురవైరి యటు జూడుమా!
కురుసేన నున్న మా బాంధవులను
దురమునూ సేయదగునా,
వీరితో? దోసంబు కాద కృష్ణా! ॥గీ॥

12. తాతలూ, తండ్రిలూను;
గురువులూ, తనయులూ, మనుమలున్నూ
భ్రాతలూ, మిత్రిలూను
మామలూ, బాంధవులు, ఆత్మసఖులు ॥గీ॥

13. పురుషోత్తమా! వీరిని,
న్యాయమా? పోరులో నే జంపుట
నరకపాతకము కాదా,
కులధర్మ నడవళ్ళు నశియింపవా! ॥గీ॥

14. జాతిహీనత నొందరా
మనస్త్రీలు; వర్ణసంకరము కాదా!

కులనాశనము జేసిన
వారికి, గలుగదా నరకప్రాప్తి ॥గీ॥

15. పిండోదకములు లేమి
అధోగతి పితృదేవత లందరే?
మొండిపట్టులు పట్టుచు
మదముతో మోహరించుట న్యాయమా ॥గీ॥

16. తత్తఱపాటు నొంది
వంశాన్ని దగ్ధంబు గావించినా
నెత్తురుకూడు గాదా
రాజ్యాన్ని నే నొల్లనయ్య కృష్ణా! ॥గీ॥

17. "రాజ్య లోభంబుచేత
కురురాజు రణములో నను జంపినా
పూజ్యమే యగునుగాని
నే నిట్టిపోరు గావింపనయ్యా" ॥గీ॥

18 అని చెప్పి కంపించుచూ
చే ధనువుజాఱ నిట్టూర్పువిడిచి
అవనిపై కూర్చుండినా
పార్థునకు హరి యిట్టు లనుచు జెప్పె: ॥గీ॥

ఇ ది ప్ర థ మా ధ్యా య ము

## ద్వితీయాధ్యాయము — సాంఖ్యాయోగము

"ఇది సంకటా కాలమూ
మనోవ్యాకులం బేలనో యర్జునా
పామరుగ జింతించినా
నీ కెట్లు భవ్యత్వము గల్గునూ? ॥గీ॥

ఆర్య సమ్మతముగాదు
యీ దుఃఖ మపకీర్తికరము సుమిూ!
ఆడారి వానివోలె
మాటలను ఆడుచున్నా వేలనో? ॥గీ॥

తగదు యీ పిరికితనము
విజయుడా! ధైర్యంబు బూను మిపుడు
నగవును విడనాడుమా
యిహపర ప్రాప్తపూజ్యత గాంచుమా!" ॥గీ॥

అన విని కిరీడి పల్కె
'శ్రీకృష్ణ! అన్యాయ మిది కాదో?
అనఘులౌ భీష్మద్రోణ
పూజ్యులను హతమార్చి కులము జెఱచి ॥గీ॥

రాజ్యంబు గొనుట కంటె
మునివృత్తి కరిమభిక్ష మెత్తమేలు
పూజ్యుడా; యీ రణమున
మన గెల్పు పూచీగ చెప్పగలవా? ॥గీ॥

6. ఇరువాగుల యందును
బలవంతు లెవ్వరో చెప్పానయ్యా?
కౌరవుల హతమార్చియు
బ్రతుకుటా కార్పణ్య దోషమయ్యా' ॥గీ॥

7. ఇందేది తెలియలేక
శ్రీహరికి వందనము లాచరించి
"సర్వదా శిష్యు నంటి
నిను బుద్ధి పూర్వకంబుగ నమ్మితి ॥గీ॥

8. నామేలు యూహించియూ
నాశోక నాశంబు గావింపవే
నీమదిని నిశ్చయించి
నాధర్మ నియతినీ జెప్పు" మనగ ॥గీ॥

9. ఎలనవ్వ మోము తోడా
కృష్ణుండు యిట్లనీ బోధించెను
"విలపింప తగనిరీతి
అర్జునా! విలపింప న్యాయమగునా! ॥గీ॥

10. తత్త్వంబు తెలిసినట్టి
పండితుని ధాటినీ మాట్లాడెదు
ధరబుట్టి గిట్టువారి
కొఱకునై తగనిట్లు శోకింతువా! ॥గీ॥

11. విలువగల సాంఖ్యమయ్యా
అర్జునా! వినుదీని తత్త్వార్థము

నిలకడచేసి మదినీ
నాబోధ నిలిపి తర్కించుమన్న ॥గీ॥

12. ఏనును యీావుగాని
యీారాజు లిచ్చ టెవ్వరునుగాని
లేకపో లేదు ముందు
యిక ముందు లేకనుండక పోవరూ ॥గీ॥

13. జీవున కీ దేహామూ
యేరీతి చెల్లుచుండునో కాలము
యితరమూ దేహాంబులూ
జెందుట యిటువంటి దే అర్జునా? ॥గీ॥

14. శబ్దాది గ్రంధములును
యింద్రియూ సఖ్యంబునుం గూడియు
యస్థిర ద్వంద్వంబుల
గలిగించు యణచుమూ స్థిరత వీనిన్ ॥గీ॥

15. 'సమబుద్ధితో ద్వంద్వముల్
జూచిన జ్ఞాని మోక్షుండుసుమ్మీ'
అనిరి యూా తత్వవిదులు
ఈసత్తు యసత్తుల నిర్ణయములు ॥గీ॥

16. ఆత్మ నశింపదయ్యా
నిత్యమై అపరిమితమై యుండును
దానిచే నపరిమితముగ
దేహముల్ ధరియింప బడుచునుండు ॥గీ॥

17. దేహంబు స్థిరముగాదూ
కురువీర దేహధారి స్థిరుడయా
దేహ దేహేంద్రియముల క
తీతుడౌ దివ్యుడౌ నజుడుగలడు ॥గీ॥

18. నిత్యు డసండుగు సుమ్మీ
ఆయజుడు నిర్వికారుండుసుమ్మీ
సత్య ప్రకాశిసుమ్మీ
ఆబ్రహ్మ సర్వవ్యాపకుడు సుమ్మీ ॥గీ॥

19. శైశవముల యందునూ
ఫల్గుణా! జాగ్రతాదుల యందునూ
మాఱు నీ దేహమయ్యా
ఎన్నడును మారడూ దేహిసుమ్మీ ॥గీ॥

20. చంపునది గాదుసుమ్మీ
యీయాత్మ చంపబడునదికాదయా
కొంతకాలం బుండునా
యీయాత్మ కొన్నాళ్ళు లేకుండునా? ॥గీ॥

21. తుద మొదలు లేనిదయ్యా
యీయాత్మ తోచు నెల్లప్పుడూను
ఆది మధ్యాంతరహిత
యీయాత్మ అనిశంబు నుండునయ్యా ॥గీ॥

22. పాతబట్టలను విడచి
మరిక్రొత్త బట్టలను కట్టినట్లే

పాతదేహముల విడచి
క్రొత్తగా ప్రాణిగైకొను దేహముల్ ॥గీ॥

ఆయుధంబులు నఱుకవు
ఆత్మనూ అగ్ని కాల్చగలేదయా!
నీళ్ళు తడుపంగ లేవు
ఆత్మనూ యెండింపలేదు గాలి ॥గీ॥

చింతలకు మించియుండు
ఈయాత్మ స్థిరమునై వెలుఁగొందును
దేహంబుతో పుట్టదూ
ఈయాత్మ దేహంబుతో గిట్టదూ ॥గీ॥

పుట్టు గిట్టుకలు లేని
ఆత్మకై పూజ్యుడా! శోకింపకు
అట్టిట్టు ఊహింపగ
శక్యమా ఆత్మగోప్యంబు తెలియ ॥గీ॥

చంపితిని నే వీనిని
నాచేత చచ్చెనూ వీడందువా
చంపినది యెవ్వరయ్యా?
ప్రాణితో చంపబడినది యెవ్వరో? ॥గీ॥

కల్లబొల్లి మాటలూ
గురు భీష్మ కర్ణ మరుయోధవరులా
తొల్లి చచ్చినవారినే
నీవిట్టె దురమునం ద్రుంపగలవు ॥గీ॥

28. వారాత్మ చావలేమ
శక్యమా వారినీ జంపనీకు
ధారుణీ పుట్టిగిట్టు
బొందెలను తరగి నాశన మంటువా? ॥గీ॥

29. నీధర్మమును వీడక
సమబుద్ధి నిఖిలమును జూడుమయ్యా
నిక్కంబు నరసి విధిగా
ఫల్గుణా! నీకీర్తి కాపాడుమా ॥గీ॥

30. ద్వంద్వంబులను విడువుమా
అహంకార నన్నె మమతలు మానుమా
ద్వంద్వభావముబు రోసి
సమదృష్టి గనిరణ సేయుమన్నా ॥గీ॥

31. నినుపాప మంటదయ్యా!
అర్జునా! నిక్కువము నా మాటలక
విను ముపవిషత్తులందూ
ఈరీతి వివరించి గలదుసుమ్మా! ॥గీ॥

32. జగతిపుట్టిన జీవికీ
ఫల్గుణా! చావునిశ్చయము గాదా?
నాశనము లేని యాత్మ
మనసుచే మర్మంబు తెలియనీదు ॥గీ॥

33. ఏ వికారము నొందదూ
ఈయాత్మ యేకమై వెలుగొందుచు

పిపీలికాది బ్రహ్మ
పర్యంత మపారమై బరగుచుండు ॥గీ॥

34. చింతనూ బొంద కికను
ఈయాత్మ చెడని బ్రహ్మంబునమ్మె
బుద్ధి యుక్తుండవగుచు
మోహాంపు బుద్ధులను బాసి నీవు ॥గీ॥

35. కర్మఫలమును గోరక
చేయనో కర్మంబు చేయుమయ్యా
క్షత్రియ ధర్మంబురు
నీ విపుడు క్షాత్రలంబున నిల్పుమా! ॥గీ॥

36. ప్రాప్తవశమున గల్గిన
ఈప్రాప్తి పాపంబుగాదు పార్థా!
నీవు రణమును చేయక
బేలవై నిలచి యమ్మెమ్మె యనిన ॥గీ॥

37. నీ శత్రువర్గ మంత
జగతినీ నీపిరికి చాటుగలదు
దురముసేయక పాటినా
వీనునకు మరణంబుమేలు కాదా? ॥గీ॥

38. రణమునన్ గూలెదేని
సురలోకరాజ్యభోగము గల్గును
జయమునూ బొందెదేని
విజయుడా! సామ్రాజ్యలాభ మొదవు ॥గీ॥

39. ఫలములందాస రోసి
నీకు విధికల కర్మంబు చేయుమయ్యా
కామ్యకర్మము నీచము
ధీయోగ కర్మంబు గావింపుమీ!

40. ఇదె సాంఖ్య యోగమయ్యా
ఫల్గుణా! యిక బుద్ధియోగ రీతి
వివరింతువినుము కర్మ
బంధంము విడిచెదవు దీనివలన

41. కర్మయోగంబు యనిన
నిష్కామ కర్మయోగంబె సుమ్మీ!
ఈబుద్ధియోగంబున్నా
చెడదయా యే యత్నంబైననూ

42. కామ్య విషయములు గోరి
'జన్మమే కర్మంబు' యని చెప్పెడు
అజ్ఞానిమాట విన్న
సమాధి నందలేవీ వర్జునా!

43. జన్మబంధము పోవును
వైరాగ్య జాడనూ వీడకయ్యా!
యిదియె జీవన్ముక్తియా
అర్జునా! యిది కర్మయోగమయ్యా

44. ఇది మోక్షద్వారమయ్యా
పార్థుడా! యిది రహస్యమ్ము సుమ్మీ!

చేసియూ చేయకాను
విజయుడా! చేయకా చేసియైన ॥గీ॥

45. ఈ రెంటినిన్ బాసియూ
కురువీర ఎవ్వరు నిలువగలరో
వారె మాహాయోగులు
మహబాహూ వారలే ధీశాలురు ॥గీ॥

46. కర్మకధికారి నీవు
ఫల్గునా! కర్మఫలహక్కు లేదు
సర్వసమత్వ బుద్ధి
యోగమూ జయాప జయములందు ॥గీ॥

47. అభిమానములను విడచి
స్థిరుడవై ఆచరింపుము కర్మలు
జ్ఞానపూర్వక కర్మతో
ఒప్పుచో జ్ఞాన యోగమె శ్రేష్ఠము ॥గీ॥

48. కర్మచే కలుగు ఫలము
విడనాడి కర్మ మాత్రమె జేసినా
జన్మ బంధముల బాసి
మోక్షపథ సౌఖ్యంబు నందగలరు ॥గీ॥

49. చంచల బుద్ధిగాని
స్థిరబుద్ధి సమాధి యందుండునో
యోగమం దుండువారె
వైరాగ్య యుక్త సుజ్ఞానులయ్యా ॥గీ॥

50. కర్మమెంతగ జేసినా
నలుసైన కర్మఫల మంట దతని
కావున యోగంబునా
పాండవా! కర్మంబులను ద్రోసియు

51. జ్ఞానంబు పూని నీవు
మదిలోని సంశయంబుల బాసియు
యుద్ధమునకు సిద్ధపడుమా
యోగివై యెప్పి జగమును గాంచుమా!"

52. భగవాను డిట్లు సెప్ప
పార్థుండు ప్రశ్నించె నీ తీరున
"ఈసమాధిని పొందినా
ప్రాజ్ఞుండు యేలక్షణముల వాడు?

53. ఎట్టులను మాట్లాడును
కూర్చుండు యెట్టులాగి సంచరించు?
దీని నా కెఱిగింపవే
శ్రీహరీ! తేటతెల్లముగ" ననగా

54. ఆ ప్రశ్నలను వినుచు
భగవాను డనియె సంప్రీతితోడ
"అఖిల కామములు వదలి
మనసున ఆత్మావలోకనమున

55. భావసంతుష్టుడైన
స్థిరమైన ప్రాజ్ఞుం డనగ నొప్పు

సుఖదుఃఖముల నెంచక
కోరికా చూడక భయముపడక ||గీ||

56. ఆత్మజ్ఞాన శీలత
స్థిరమైన ఆత్మయందు మునియె సుమహాత్మ
తాబేలు అవయవముల
ముడుచుకొను తనలోని కే భంగినో ||గీ||

57. విషయ రాగేంద్రియముల
ఎవ్వండు విషయములనుండి విడునో
వాని బుద్ధి జ్ఞానము
సుస్థిర వన్నెవాసియు గాంచును ||గీ||

58. నియమితాహారంబున
దేహుండు నిల్పు విషయగ్రహణము
తగుహార వాంఛ విడునే
పరమార్థ దర్శియగు ప్రజ్ఞావోతె ||గీ||

59. జ్ఞాని తా నింద్రియముల
జయమందు జాడను గావించినా
బలవంత యింద్రియములు
మనసునూ బలవంతముగ ద్రిప్పునా ||గీ||

60. ఆత్మదర్శా పేక్షులు
ఆయింద్రియముల వశపరచుకొనియు

నన్నెపుడు ముఖ్యమనుచు
ప్రజ్ఞతో యెన్నుకొని యాశ్రయింత్రు ॥గీ॥

61. ఇంద్రియా విషయంబుల
గూర్చినా యీతలపు వానియందు
కూర్పించు యభిమానము
దానిచే కోరికలు పుట్టునయ్యా! ॥గీ॥

62. దానివలన కోపము
కోపాన తగు మోహ మనెడి మాయ
మాయచే మతివిభ్రము
దానిచే మనసు పాడగును సుమ్మీ! ॥గీ॥

63. మనసు పాడగుట చేత
నశియించు మానవుం డెంతయైన
మాఅభిమానము లను
విడిచియు మనసును వశపర్చియు ॥గీ॥

64. నిర్మలత్వము నొందిన
యోగికిని నిఖిలంబు యెక్క టగును
నిర్మలత్వము లేనిచో
అర్జునా! నిశ్చయపు బుద్ధిలేదు ॥గీ॥

65. ఇంద్రియ నిగ్రహము లేక
భావనా యిసుమంత యుండదయ్యా
భావనా లేకున్నచో
శాంతమూ, ఫల్గుణా! యుండదయ్యా ॥గీ॥

66. శాంతంబు లేకున్నచో
జీవికీ సౌఖ్య మేరీతి గల్గు?
ఎదుర గాలీ యోడను
నీటిలో యేరీతిగను ముంచునో! ॥గీ॥

67. చరియించి యింద్రియములు
మనసునూ చప్పరించివైవవా?
ఆమనను పురుష ప్రజ్ఞ
హరియించి హతమార్చు నమ్మమయ్య ॥గీ॥

68. ఇంద్రియార్థముల నుండి
పూర్తిగా యింద్రియా నిగ్రహణము
కల్పించిన జ్ఞానికి
జ్ఞానము ఘన స్థిరమై యుండును ॥గీ॥

69. ప్రాణులకు రాత్రి యనెడు
జ్ఞానమున ప్రాజ్ఞుండు మేలుకొనియు
మేల్మియాత్మను గాంచును
ప్రాణులు మేలుకొనుచూ నుండగా ॥గీ॥

70. ఆత్మనూ దర్శించుచూ
ఆహాని యదిరాత్రిగా నెంచును
నదీప్రవాహములచే
సాంద్రింబు కదలకను నిల్చునట్లే ॥గీ॥

71. వాంఛా పరంపరలచే
చలింపని వాడె శాంతిని బొందును

మమతా యహంకారముల్
లేకున్న మానవుడు శాంతి నొందు ॥గీ॥

72. ఇది కర్మస్థితి యందురు
బ్రహ్మస్థితి యిదియే యనుచునందురు
నరుడు దీనిని జెందిన
మోహంబు మరల నిక జెందడయ్యా! ॥గీ॥

73. మరణవేళను యీస్థితి
నరుడున్న బ్రహ్మనిర్వాణమందు
ఇదె సాంఖ్యయోగమయ్యా
రణముకై పదిలపడి నిలువుమయ్యా!" ॥గీ॥

ఇది ద్వితీయాధ్యాయము

---

# తృతీయాధ్యాయము — కర్మయోగము

1. నరుడు యీ బోధ వినుచు
యిట్లనియె "నారాయణా! ఏమిటో
కర్మ సన్యాస మనుచు
మఱియును కర్మయోగంబుననుచు ॥గీ॥

2. యీ రెంటి చెప్పితీవు
మేలేదో యీరెంట నిశ్చయింపు"
మన విని భగవానుడు
కిరీడితో ననియె చిరునవ్వుతోడ ॥గీ॥

3. "మోక్షదాయకము లె సుమ్మా
యీరెంటి మూలమెఱుగని వారలు
వేఱు వే ఱని యందురు
అర్జునా! వివరింతు నీ యర్థము ॥గీ॥

4. సాంఖ్యులకు జ్ఞాన మరయ
ముఖ్యమౌ సాధనంబౌ అర్జునా!
యోగులకుముఖ్య మగును
యీ కర్మయోగమె నమ్మమయ్యా! ॥గీ॥

5. ఈ రెండు మార్గములను
జగమందు నే ముందె వచియించితి
కర్మజేయని మాత్రినన్
యెవరికిని గల్గునా? జ్ఞాననిష్ఠ ॥గీ॥

6. కర్మ సన్యాసమునను
యేరీతి గల్గునో సిద్ధి? చెపుమా
జగమందు యెవ్వారేని
తా మొక్క క్షణమాత్రమైనగాని

7. కర్మచేయక నుండరు
ప్రకృతియె కర్మలను చేయించును
కర్మ చేయని వారలు
యీభువిని కనుగొనన్ యెవరులేరు

8. సంకల్పముల నణచక
తనయిచ్ఛ సంచరించెడి యోగియు
యోగ యుక్తుండుగాక
యథేచ్ఛ నుండెడి సన్యాసియు

9. వీరిద్దరును వ్యర్థులే
యిటుచేయ నీరెంట ఫలమబ్బునే
మనసుచే యింద్రియముల
బంధించి మమకారములనువిడచి

10. కర్మేంద్రియముల చేత
నెవ్వండు కర్మయోగము చేయునో
వాడె మహాశ్రేష్ఠుడు
నీ కర్మ వీడకను చేయుమీవు

11. కర్మ హెచ్చగును సుమీ
అర్జునా! కర్మంబులేకయున్న

ఈ శరీరము నిల్చునా
కర్మవిడ నీజ్ఞాన నిష్ఠవలన ॥గీ॥

12. కర్మ యజ్ఞార్థమయ్య
యీజగము కర్మబద్ధంబైనది
కర్మఫలమును దైవతా
దత్తముగ కర్మంబుసేయుమయ్యా ॥గీ॥

13. బ్రహ్మదేవుండు తొల్లి
యజ్ఞమున ప్రజలనూ సృజియించియు
'ఈ యజ్ఞముల తోడనూ
మిము మీరు వృద్ధి గావించుకొన్నుడు ॥గీ॥

14. ఇవి మీమీ కోరికలను
పూర్తిగా యిచ్చు నీ యజ్ఞములచే
అమరులను పోషింపుడు
వారు మీకభివృద్ధి జూపింతురు ॥గీ॥

15. పరస్పరాభివృద్ధి కతన
మీరలు భవ్యమేలులగాంతురు
యజ్ఞభావితులు సురలు
మీకోరు యభీష్టముల కూర్తురు ॥గీ॥

16. అమరు లిచ్చినదానిని
వారలకు అది యిడనివాడు దొంగ
యజ్ఞావ శిష్టములను
భుజియించు ఆత్మజ్ఞానులు ముక్తులు ॥గీ॥

17. తమపొట్ట నింపుకొనెడు
పాపులు తమపాపమునె తిందురు''
బ్రహ్మయీరీతి బల్కె
సృజియించి ప్రజలతోడుత నర్జునా!

18. భూతంబు లన్నియును
అన్నమున భువిలోన బుట్టెనయ్యా
అన్నంబు వర్షంబున
వర్షంబు యజ్ఞంబునన్ బుట్టెను

19. యజ్ఞంబు కర్మవలన
ఆ కర్మ యజుసివలనను బుట్టెను
అజు డక్షరంబు నుండి
పుట్టియు అంతటను నిండియుండు

20. ఆబ్రహ్మము నిత్యము
ప్రతిష్ఠుడై యజ్ఞమం దేయుండును
యీరీతి వర్తించెడు
చక్రమం దెవ్వ డనుసరింపక నుండుచూ

21. వశుడౌనా యింద్రియముల
కతడెగా వ్యర్థజీవుడు పాపుడు
ఆత్మ తృప్తిచేతను
ఆత్మచే ఆత్మ కానందమొదవు

22. విషయ వాంఛలవీడిన
జేయునది విశ్వమున లే దేమియు

కర్మ మాతడు జేసిన
రవ్వంతగలుగదు ఫలమునుమిన్మా ॥గీ॥

23. కర్మంబు జేయుకున్న
నష్టంబు గలుగదు వాని కెందు
సర్వభూతంబు లందు
వానికి సాధింప లే దేమియు ॥గీ॥

24. ఫలకాంక్ష లేకుండగ
నీవు నీ పనులకు గావింపుము
ఫలమునం దాస లేని
కర్మచే బరము సిద్ధించు నీకు ॥గీ॥

25. తొల్లి కర్మాయోగము
జనకాదు లెల్ల గావించె ప్రీతి
ఈ లోక మేలు దలచి
కావింపు నీ విహిత కర్మంబుల ॥గీ॥

26. ఏది శ్రేష్ఠుడు జేసినా
చేయుదురు ఇతరజనులును గూడను
అతని ప్రమాణంబు నే
లోకంబు లాచరించును శక్తితో ॥గీ॥

27. ఏను చేయగదగినది
త్రిలోకమం దేదియును లే దర్జునా!
పొంద దగినదియు లేదు
నాకు నే పొందనిది కానరాదు ॥గీ॥

28. అయినను కర్మమందే
నే సదా అనుసరించియు నుందును
నే కర్మ జేయకున్న
నామార్గమే లోకు లనుసరింత్రు

29. లోక మూర్ధాన జెడును
సంకరము లోకమున వ్యాపించును
దాన నే కర్త నౌదు
ప్రజ దాని హానిచే నశియించును

30. మూఢు డాసక్తిచేత
కర్మమును మోదమును జేయునట్లే
జ్ఞాని లోకారక్షకై
కర్మఫలమును విడచి కర్మచేయు

31. ఆత్మ జ్ఞానంబు వాడు
కర్మాభిమాన యజ్ఞానులకును
బుద్ధి చాంచల్యంబును
ఎప్పుడును పుట్టింపరాదు పార్థా!

32. కర్మనిస్సంగు డగుచు
యితరులకు కర్మప్రీతినిగలుగగ
కర్మ తా జేయవలయు
లోకోపకారంబు మది నెంచుచు

33. ప్రకృతిగుణమువలనను
కర్మముల్ పరగును స్వాంతమ్మున

మూాఘు డహంభావంబున
కర్మలకు ముఖ్యుడే తా ననుకొను ॥గీ॥

34. గుణకర్మచయ బేధము
గుణములు గుణముల గూడి తిరుగ
అనియెంచి తత్త్వవిదులు
విడచెద రహంకారాసక్తులన్ ॥గీ॥

35. ప్రకృతిగుణమువలనను
మూాఘులు భ్రమియింప బడి యున్నచో
తెలిసినా తత్త్వవేత్త
అలవారి తెలివిడా జెఱుప తగదు ॥గీ॥

36. సర్వేశ్వరుండనైన
నాయందె సర్వకర్మలను విడచి
అధ్యాత్మ ముక్తుండవై
ఫలముకై ఆశపడకను భక్తితో ॥గీ॥

37. కావింపుమీా యుద్ధము
అర్జునా! కర్మె నిన్నంటదయ్యా!
నేను చెప్పిన మతమును
యెవ్వారు నేర్పుతో గావింతురో ॥గీ॥

38. సర్వకర్మముల నుండియు
ముక్తులై సత్యముగ నన్ గాంతురూ
అట్లుసేయంగ లేక
యెవ్వా రసూాయచే వర్తింతురో ॥గీ॥

39. భ్రష్టలగుచును ందురు
అజ్ఞాన బలముచేతను వారలు
ప్రకృతినే యనుసరించి
విజ్ఞాని ప్రవర్తించుచునుండును

40. నిఖిల భూతంబు లెల్ల
ఈప్రకృతి నేర్పునే యనుసరించు
నిగ్రహంబేమి చేయు
విజయుడా! నిశ్చయము నమ్ముమన్న

41. ఇంద్రియంబుల యందున
నుండునూ ఇంద్రియూ విషయంబులు
మోహమున కడ్డులైన
రెంటికిన్ మోహార్థి లొంగరాదు

42. పరధర్మ నేర్పు కంటె
స్వధర్మము భ్రష్టమైనను మేలయా
మరణమైనను మేలయా
స్వధర్మము పరధర్మ మెపుడు కీడె"

43. అన, విని హరిని జూచి
ధనంజయు డనియె తా నీలాగునా
"పాపకర్మము జేయగ
గోరని భావంబు గల మనుజుడు

44. ఏ బలప్రేరణమున
పాపంబు యేగతి జేయు దేవా!"

అని ప్రశ్న వేయునట్టి
కిరీటికి హరి యిట్టు లనుచు జెప్పె ॥గీ॥

45. ఇదియె కామక్రోధము
రజోజాత! మిది మహాశనము వైరి
పాపమును నాశంబును
గల్గించు పనులను జేయించును ॥గీ॥

46. అగ్ని యా పొగలను
గప్పబడు అద్దంబు మలినమునను
గర్భపిండము మావిచే
నేమాడ్కి గప్పునో యా రీతిగా ॥గీ॥

47. జ్ఞానమును ఆవరించి
కామంబు గలుగనీయదు తేజము
కష్ట సాధ్యంబులైన
విషయాళి గామమే కోరి విడక ॥గీ॥

48. జ్ఞాన స్వరూపుడైన
మానవుని జ్ఞానంబు నావరించు
ఇది జ్ఞానులకు శతృవు
మనోబుద్ధేంద్రియము లునికి తనకు ॥గీ॥

49. జ్ఞానము నావరించి
కామంబు తను యింద్రియముల గూడి
మమకార మగ్న జేయు
దేహిని మాయా ప్రభావంబున ॥గీ॥

50. కాన యీ మాయ తెలిసి
దేహికిన్ జ్ఞాన వినాశంబగు
పాపియగు కామంబును
పార్థుడా! రూపుమాపుము పూనికతో

51. హెచ్చు సుమీ యింద్రియములు
వానికిన్ హెచ్చగును మనసు పార్థా!
మనసు కన్నను శ్రేష్ఠమౌ
బుద్ధికిన్ ఘన మగుచు బరగు నాత్మ

52. ఆత్మ తత్త్వమును తెలిసి
ఆత్మచే నద్దాని నెదురు కొనుచు
కష్టసాధ్యంబునైన
యీపాప కామమును గెలువ వలయు

53. ఇది కర్మ యోగమయ్య
జ్ఞాన యోగ మిక మీద వినుము పార్థా!

ఇది తృతీయాధ్యాయము

## చతుర్థాధ్యాయము — జ్ఞానయోగము

1 అవ్యయ యోగంబగు
దీని నే నర్కునకు జెప్పియుంటి
అర్కు డది దెలిపియుండె
మనువునకు అతడు ఇక్ష్వాకునకు జెప్పె ॥గీ॥

2. వంశపరంపరగ నిద్ది
రాజర్షి వరులచే గొలువబడుచు
కాలవశమున మందులౌ
రాజులౌ పాలపడి నశియించెను ॥గీ॥

3. మిత్రుడవు భక్తుండవు
అగునీకు మేలైన యీ యోగమున్
చెప్పియుంటిని'' యనగను
అర్జునుడు శ్రీహరి కిట్టు లనియె ॥గీ॥

4. ''ఇంత వింత పలుకులు
మాధవా! నే నెట్లు నమ్మగలను
నీకంటె పూర్వుడైన
సూర్యునకు నీ వెట్టు లాదియందు ॥గీ॥

5. ఈ యోగమును తెల్పితో
తెలియకను నే నెట్లు నమ్మగలను''
అని యిట్లు ప్రశ్నించినా
కిరీటితో నత్యుతుం డిట్టు లనియె ॥గీ॥

6. "పరంతపా! నీవు నేను
యిదివరకు బహు జన్మలెత్తినాము
నీ జన్మల నీ వెఱుగవు
ఎఱుగుదును నాజన్మ లన్ని నేను ॥గీ॥

7. పుట్టుగిట్టుటలు లేక
ఆత్మస్వరూపుండనై యుండి నేను
భూతాదిపతి నగుచును
ప్రకృతిని పుట్టుదు న్నామాయ శక్తిచేత గీ॥

8. ఏయే వేళలందు
ధర్మముల కేదేని హాని గల్గ
ఆయా వేళ లందు
జన్మింతు నామాయ శక్తిచేత ॥గీ॥

9. దుష్టులను సంహరించి
అర్జునా! శిష్టులను రక్షించియు
ధర్మ సంస్థాపకునై
యుగ యుగము ధర జన్మ లెత్తు చుందు ॥గీ॥

10. దివ్యా వతార క్రియల
నాలీల దెలిసికొన్నట్టి వారు
తిరుగ జన్మము నందక
నను జేరు దేహాల విడిచి వారు ॥గీ॥

11. కోరిక భయ క్రోధముల్
విడచిన వారు నన్నాశ్రయించి

జ్ఞాన తప మాచరించి
పరిశుద్ధులై నాభావము పొందిరి ॥గీ॥

12. ఏరు నన్నేరీతిగా
అండగొన, వారి నా రీతి జూతు
మానవులు సర్వవిధుల
నా యొక్క మార్గము నె యనుసరించు ॥గీ॥

13. కర్మఫలముల గోరుచు
దేవతల గాంక్ష నారాధింతురు
కర్మచే గలుగు ఫలము
సిద్ధించు కాదె యీ లోకమందు ॥గీ॥

14. నాలుగు వర్ణంబుల
వారలు నాచే సృజింప బడిరి
వారి వారల యొక్కయు
గుణకర్మ విభాగముల వలనను ॥గీ॥

15. ఈ సృష్టి కంతటికిని
కర్తను నేనె యయినప్పటికిని
నేను కర్తను గానని
నాశనము లేని వాడనని తెలియుమీ ॥గీ॥

16. కర్మ లంటగ నేరవు
నను, నాకు కర్మఫల వాంఛ లేదు
నన్నిట్లు తెలిసికొన్న
కర్మలచే నమ్మ్మ బంధింప బడరు ॥గీ॥

17. ఆది ముముక్షువులు ఇట్లు
తెలిసికొని ఆచరించిచిరి కర్మలు
అతిపురాతన కర్మము
నీవును ఆచరింపుము విజయుడా!

18. కర్మా కర్మములను
నిశ్చయము గావింప లేక బుధులు
భ్రాంతినిం బడుచుండిరి
అందుచే స్పష్టంబుగను జెప్పెద

19. వివరముగ నెఱిగి దీని
అశుభముల విడిచి మేలును గాంచుము
జ్ఞాన యోగంబు సుమ్మి
అర్జునా! చక్కగా వినుము దీని

20. విహిత ధర్మాచరణ
రూపమై వెలయు సుకర్మము యొక్కయు
నిషిద్ధ ధర్మాచరణ
రూపమై నెగడు వికర్మము యొక్కయు

21. నిర్వ్యాపారత్వస్వ
రూపమై ఎసగు అకర్మము యొక్కయు
అసలైన స్థితులు తెలియు
అర్జునా! ఆవశ్యకంబు సుమ్మా!

22. కర్మమున, అకర్మలును
అకర్మంబున కర్మలును జూచువాడు

సర్వ కర్మలు జేసినా
వాడును బుద్ధి శాలియు యోగియా ॥గీ॥

23. సతతమును యేపురుషుడు
కామ్య సంకల్పముల విడచి జేయు
అవ్యాని కర్మంబులు
జ్ఞానాగ్ని యందుబడి దగ్ధమగును ॥గీ॥

24. పండితుం డాత డనుచు
జ్ఞానులు పలుకుదుః మెచ్చుకొనుచు
ప్రికృతి నాశ్రయము లేక
తుష్టుడై బహుకర్మ లాచరించి ॥గీ॥

25 కర్మ ఫలమం దాస విడిచి
బరగిన కర్మచేయని వాడగు
ఈ ఫ్సితము లేని వాడై
మనసును యింద్రియముల నిగ్రహించి ॥గీ॥

26. ప్రికృతి సంబంధించియు
నున్నట్టి వస్తువులం దాస విడువ
పాపంబులను బొందడు
కేవల శరీర పనుల తా జేయువాడు ॥గీ॥

27. చేయు కే యత్నంబును
ఆవేళగు సిద్ధికే తృప్తి నొంది
చలి, వేడి, సుఖ, దుఃఖము
ద్వంద్వముల చర్చలకు చలియింపక ॥గీ॥

28. మాత్సర్యమును వీడుచు
జయాపజయ మహిమలకు సముడౌనై
స్థిరప్రజ్ఞతోడ తాను
కర్మమును చేయ బంధింపబడడు

29. ఫలమునం దాస రోసి
జ్ఞానియై ప్రకృతిచే విడువ బడియు
భగవ దర్పితము గాగ
చేయబడు కర్మముల్ నశియించును

30. యజ్ఞంబునం దగ్నియు
వేల్చబడు హావిస్సునుం బ్రహ్మయే
యజ్ఞంబులే బ్రహ్మము
బ్రహ్మమే యజ్ఞంబులని తెలియుమా!

31. దైవ, స్వాధ్యా, యేంద్రియ
కర్మతపో ద్రవ్యయోగ జ్ఞానముల్
అరయ ప్రాణాయామ మీ
తొమ్మిదియు యజ్ఞంబు లనగ బడును

32. బ్రహ్మజ్ఞానంబు తోడ
సర్వమును బ్రహ్మమే యనుచు మదిని
భావించి యజ్ఞములను
చేయుచో బ్రహ్మంబునే బొందును

33. వెలసె బ్రహ్మంబునుండి
యజ్ఞములు; సలుప మోక్షంబు గల్గు

యజ్ఞములు సేయకున్న
వారలకు అరయంగ ముక్తిలేదు ... ॥గీ

34. సర్వయజ్ఞంబు లందు
యూహింప, జ్ఞాన యజ్ఞమె శ్రేష్ఠము
ఫల్గుణా! జ్ఞాన మందు
కర్మముల్ పరిసమాప్తము నొందును ॥గీ॥

35. నతు లొనర్చుట చేతను
ప్రశ్నచే, నయసేవ జేయు కతన
ఆ జ్ఞానమును దెలియుమా
అర్జునా! ఆత్మ తత్త్వము నెఱిగిన ॥గీ॥

36. జ్ఞానులవు డంతమీద
నీకును జ్ఞాన ముపదేశింతురు
అట్టి జ్ఞానంబెఱిగిన
పిమ్మటను యిట్టి మోహము నొందవు ॥గీ॥

37. అఖిల భూతముల నీవు
అద్దాన యాత్మలో గాంచగలవు
అఖిలాత్మ కుండనైన
నాలోను అట్టులే గాంచ గలవు ॥గీ॥

38. పార్థా! నీ వారులకన్న
ఎక్కువగు పాపముల చేసియున్న
పాపమను సంద్రింబుల
జ్ఞానమను పడవచే దాట గలవు ॥గీ॥

39. మండుచున్నట్టి యగ్ని
కట్టెలను భస్మంబు జేయునట్లు
జ్ఞాన మను నట్టి యగ్ని
అఘములను కానగన్ గూపుమాపు

40. జ్ఞానయోగము సాటియగా
యోగంబు కాన రా దోయి పార్థా!
దీని భావం బందిన
వారలనె జ్ఞానులని తెలియుమయ్యా

41. జ్ఞానంబు జెందుపిదప
వానికిన్ సర్వంబు సిద్ధించును
అట్టి యోగికి కర్మముల్
అంటవని అర్జునా! తెలియుమయ్యా

42. అజ్ఞాన కృతము వలన
నీ హృదయ మందుద్భవించినట్టి
ఆత్మసంశయము లిపుడు
జ్ఞానమను అసిచేత ఖండింపుము

43. యోగసిద్ధుడవు కమ్ము
అర్జునా! జాగొనర్పక లెమ్మికన్
ఏ నీకు యిటు జెప్పిన
దీనినే జ్ఞాన యోగం బందురు"

ఇది చతుర్థాధ్యాయము

---

# పంచమాధ్యాయము—కర్మ సన్న్యాసయోగము

1. భగవాను నుపదేశమున్
అలించి, పార్థుండు యిట్లులడిగె
"కర్మయోగం బనుచును
మాధవా! కర్మసన్న్యాసమనుచు ॥గీ॥

2. దెలుప, నే నద్దానిని
మాధవా! తెలియంగ నేర కుంటి
ఈ రెంట నెది శ్రేష్ఠమో
దానినిన్ యీవు నాకుం దెల్పుము" ॥గీ॥

3. అని విని భగవానుడు
"అర్జునా! ఆరెండునుం శ్రేష్ఠమే
కర్మసన్న్యాసము కన్నను
శ్రేష్ఠంబు కర్మ యోగంబె సుమ్మి ॥గీ॥

4. ద్వంద్వంబుల విడిచి పెట్టి
సంసార బంధ ముక్తుడవు కమ్మి
రెండింటి నేదేనియు
చేయుచో రెంటి ఫలమున్ గల్గును ॥గీ॥

5. కర్మ యోగము నేర్వక
జ్ఞానంబు కలుగు టన్నను కష్టము
కర్మ యోగాసక్తుడు
సర్వమును గని ఒకటిగాగ దలచు ॥గీ॥

6. కర్మ ఫల రహితుడైన
జ్ఞాని కే కర్మ లంటవు దెలియుమీ
కమల పత్త్రము కెన్నడు
జలబిందు కణము లంటని భంగిని

7. తాను జేయగ లేదని
యింద్రియములే నిటుల జేయు ననుచు
తలచి కర్మముచేయుచు
దానగల ఫలమునం దాస విడిచి

8. యోగావ లంబకుండు
కర్మఫల త్యాగంబు జేయుకున్న
కామ బంధితుడు నగుచు
మోక్షంబు గాన నెన్నడు దెలియుమా

9. లోక ప్రభుడగు యీశుడు
తనుకర్త గాక ప్రకృతియె ఫలముల
కలుగ జేయుచునుండును
యద్దాన కర్మవర్తనము జరుగు

10. ఆత్మజ్ఞానంబు వలన
యెవ్వార లజ్ఞానమున్ బాయునో
వారి మదిలో వెలైడి
పరమాత్మ కోరి తా చూడగలరు

11. అట్టి పరమాత్మ యందే
మదినిల్పి యాత్మదా నందు జేర్చి

అనిశ మా పరమాత్మను
ధ్యానించు నత డింక జన్మ గనడు ॥గీ॥

12. ఆత్మజ్ఞానము గల్గిన
పండితులు అన్నింటి నొకరీతిగా
సమదృష్టి తోడ జూచు
ఫల్గుణా! సర్వంబు బ్రహ్మమనుచు ॥గీ॥

13. శీతోష్ణ సమ దుఃఖముల్
తానొక్క రీతిగా దలపోయుచు
జీవ యాత్రను గడుపుచు
జ్ఞానియై సేవింప వలయు నన్ను ॥గీ॥

14. కర సన్న్యాస యోగ
క్రమమెల్ల గనగ నే వివరించితి
కదలుమా శంక విడచి
అర్జునా! ఇది పంచ మాధ్యాయము" ॥గీ॥

ఇది పంచమాధ్యాయము

---

# షష్ఠమాధ్యాయము—ఆత్మసంయమయోగము

1. శ్రీకృష్ణ భగవానుడు
కిరీటితో జెప్పంగ బూనె నిట్లు
"చేయు కర్మల ఫలమును
గోరకను చేయువాడే యోగియగు ॥గీ॥

2. సన్న్యాస మను దానిని
'యోగ'మని సర్వులు దలపోతురు
సంకల్పమును విడువక
యెవ్వండు సన్న్యాసి యనగ బడడు ॥గీ॥

3. సర్వజ్ఞుడైన తనకు
కర్మమొక సాధనంబుగ నుండును
యూహింప విషయ వాంఛ
విడచుచో యోగారూఢు డగును ॥గీ॥

4. బుద్ధిచే మనసు నెప్పుడు
నరికట్టు పురుషుండె జ్ఞాని యగును
మనసు నరికట్టకున్న
శత్రువై దనరుగాదె యర్జునా! ॥గీ॥

5. శాస్త్రానుభవము కతన
యోగియై 'సర్వంబు బ్రహ్మ' మనుచు
దెలియునా కూటస్థుడే
జీవుడని దెలియుచే యోగమయ్య ॥గీ॥

6. కర్మయోగంబు నందు
అర్జునా! గణ్యతను గన్న యోగి
ధరణి యోగారూఢుడై
అద్దాన తాను మోక్షం బందును ||గీ||

7. సమతలంబగు భూమిపై
ఆసనను లమరించి కూరుచుండి
ఏకాగ్ర చిత్తు డగుచు
పరమాత్మ నెఱిగి ధ్యానింపవలయు ||గీ||

8. శాంతచిత్తంబు తోడ
వ్రతనియమ భాతి నట్ట నెఱుగవలయు
యోగియై నట్టివాడు
శుద్ధుడై రాగద్వేషము లందక ||గీ||

9. తిండి ఎక్కువ తిన్నను
అర్జునా! తిండి బొత్తిగ మానినా
నిద్రయెక్కువ పోయిన
పోకున్న నిజ యోగసిద్ధి గనడు ||గీ||

10. ఎపుడాత్మ పరమాత్మయుక్త
ఏకమై, ఏ వియోగము నందక
వెలుగుచే ధన్యయోగ
మానబడును విజయ! నీ విది తెలియుమా ||గీ||

11. సంకల్ప జనితమైన
కోర్కెలను సాకల్యముగ విడచియు
ఇంద్రియ సర్వస్వమున్
మనసుచే నింపార నిగ్రహించి ||గీ||

12. విజయుడా! స్థిరముగాని
నీ మది విషయములు గోరునపుడు
అప్పుడే దాని విడచి
దాని నీ యాత్మకుఁ వశపరచుము ॥గీ॥

13. ఈ రీతి నాత్మధ్యాన
మెల్లపుడు నింపొంద జేయు యోగి
సర్వభూతము లాత్మగ
తలపోయు సమబుద్ధితోడ నెపుడు ॥గీ॥

14. నన్ను అన్నిట యందును
ఫల్గుణా! నా యందు నన్నింటిని
వీక్షించు వాని నేను
తను నన్ను విడిచి యెన్నడు నుండము" ॥గీ॥

15. హరి యిట్టు లనగ కిరీడి
ఆలించి "పురుషోత్తమా! ఎట్టులఁ
మది సమత్వం బందును
యారీతి మానుగను దెల్పుమయ్య! ॥గీ॥

16. యోగస్థిరాశ్వస్థను
విపులముగ జా గొనర్పక దెల్పవే
నిజముగా నా మనంబు
చలి యించి నిక్క మరయక నున్నది" ॥గీ॥

17. చిత్తంబులో శంకను
దెల్పనెడ శ్రీకృష్ణు డిట్టు లనియె
"సందియము గొన్న దెదియో
దానినే సత్యముగ మన మందుకు ॥గీ॥

18. చంచలం బగు దానిని
అతికష్ట సాధ్యంబు కాదుగాని
అభ్యాస వశత దాని
సాధనతో అర్జునా! [illegible]

19. “మనసు నిలవక యున్న
పరతత్త్వ మహిమ నెఱుగ నసాధ్యము
యిహాపరంబుల రెంటికిన్
చెడిన వా రేరీతి తరియింతురు ||19||

20. భక్తియును శ్రద్ధగలిగి
యుండియు వైరాగ్యంబు చాలకున్న
యోగ చాంచల్యమైన
మనసుతో నొప్పు నేగతిని బొందు ||20||

21. ఈ నాడు సందియమును
బాపి నీ వేరీతి గాపాడెదో
యీవుగా కింకెవ్వరు?
శ్రీహరీ! యెలమినన్ బ్రోచువారు” ||21||

22. నిర్మలిన చిత్తుడగుచు
హరికి దా కేల్మోడ్చి విన్నవింప
కరుణించి భగవానుడు
యిటు చెల్ప నరుడు మోదం బందగ ||22||

23. “భక్తుడై తను సల్పిన
పనులెల్ల భగవదర్పితము లగుట
అతడిహాపరము లందు
నాశనం బందబోడని తెలియుమా ||23||

